యోదార్వగలదు? ప్రదక్షిణించి కరుకాన్నిర్చి, శివాలయా నికి తరలిపోయినది. అతని వాక్కులు చావులేనివై, వాయు మార్గమున ప్రతిధ్వనించుచున్నవి. గణబద్ధములైనవి. రెండవ గబ్బిలమను కావ్యమై నిలిచినది. నేడుగాక మరొకనాడు ఫలించును. ఫలిత మనుభవించు భాగ్య మతని కున్నదో లేదో.

గ్రంథకర్త
జి. జాషువ.

# కృతిపతిప్రశంస

తొలిసందేశము చంద్రమౌళికిడి, సంతోషంబుగల్పించి, తె
ల్గుల యాశీస్సులు చూరలాడితి వసుంగుంబక్షిణీ! యిప్పుడీ
మలి సందేశము, సింహపట్టణము సంపాదించుకొన్నట్టి, దా
తల పై చేతికి రామిరెడ్డి కిడుమా దర్శకమాశాలికిన్. ౧
ఘనతంగన్న సుదర్శనాంబయెడ, నేకచ్ఛత్ర సామ్రాజ్య పా
లనగావించిన చక్రవర్తి, కులజుల్, గర్వింప విఖ్యాతి మం
డనమున్ దాల్చిన మేటి, తిక్కవరపుంవంశంబు, నైశ్వర్యపున్
ఖనిగా దిద్దిన రామిరెడ్డి మణికిం, గైవారమర్పింపుమా! ౨

వదరుబోతులు సిగ్గుపడ్డ రసోత్కటమైన
పలుకు లింపున సర్ది వాడు వాగ్మి
అలఘు టుత్సవ మింటగలుగునాడును జరీ
ఖండువా లెఱుఁగని, కర్మయోగి
ప్రమదపేరిటి యాబ్దికమునాడు, పేదల
మృష్టాన్నముల దేల్చు మేటిదాత
ప్రకృతి శ్రీకృష్ణరాయలోయనఁ గవీం
ద్రశ్రేణి నేటేటఁ దనుపురసికుఁ
గీ. డాదమఱచి రిపులనైన కొండొక వేడి
మాటయాడనట్టి యమృతమూర్తి
తిక్కవరపు వంశ దినమణి. కలిచ గ

౨

పహరాయిచ్చుచు సర్వభోగములు సేవావృత్తి గావింపగా
సహజంబైన పవిత్రవర్తనకు లోపంబింత రాకుండగా,
మహనీయంబగు న్యాయమార్గమున ధర్మస్యందనారూఢుఁడై
విహరించున్ మన రెడ్డిరాజు శుభలబ్ధిన్ వింతయోగీంద్రుఁడై.

విహగీ! సింహపురాన రెడ్డికులజుల్ పెక్కండ్రుదారాశయుల్
సహపంక్తిన్ భుజియింత్రు పంచములతోఁ, జల్లారె నస్పృశ్యతా
దహనంబందుల రామిరెడ్డివిభు నాదర్శాశయంబుల్, జగా
రహదారుల్, ధరణీశుభోదయ రథ ప్రస్థానలీలాప్తికిన్.

అంచితమైన భారతమహాకృతి ఖాద్యమునారగించి, జీ
ర్ణించిన బొజ్జతో మసలు, నిశ్చలనీరధి, స్తోత్రపాఠకుల్
వంచన చేసినన్ శివముబట్టి నంటిపని రామిరెడ్డిరా
ట్పంచముఖంబు, నీకు గృతిభర్తృతఁదాల్చెనికేమి కావలెన్.

అల్లుండ్రున్ గొమరుల్ కుమారితలు కారాగారవాసంబుచేఁ
దల్లిన్ భారతమున్ దనించిన యుదాత్తత్యాగ వారాన్నిధుల్
నెల్లూర్వేల్పు కటాక్షవీక్షణ రుచుల్ నిండాగఁ బ్రఖ్యాతిలో
నిల్లుంగట్టిన రామిరెడ్డి మణి, నీ యిష్టార్థముల్ గూర్చెడిన్.

శ్రీసుదర్శనాంబ, చిగురు కెంగేలితో
నాటిచన్న పూలతోటలందు,
విహరణంబొనర్చి, విశ్వవిచారంబు

# గబ్బిలము

గబ్బిలమేమని చెప్పెనొ
గుబ్బలియల్లుండు, కన్నుగోనల నశ్రుల్
గుబ్బటిల లేచి, నల్లని
మబ్బులలో తక్షణంబ మాయంబయ్యెన్. ౧

తిరువానుకూరు దేవుఁడు
తెఱచెం గుడితలుపు లితర దేవుఁడ్లును బి
త్తరవోయి నిమ్నజాతుల
దరిసెనమున దరిసి రాత్మదౌర్భాగ్యదశల్. ౨

అంటరాని తనంబునంటి భారతజాతి
భువనసభ్యత గోలుపోయెననుచు
క్షమకుమించిన కత్తి జర్మనీయుద్ధాన
గనుగొన్న మొనగాడు గలుగడనుచు
కదురు రాట్నముచేతగాక స్వేచ్ఛాస్వర్గ
ముదముజిక్కుట నభఃపుష్పమనుచు
నూరేండ్లుగాదు మున్నూరేండ్లు మనవచ్చు
న్యాయమార్గంబున నడువుడనుచు

నిమ్న జాతుల కన్నీటి నీరదములు
పిడుగులై దేశమును గాల్చివేయుననుచు
రాట్నమును దుడ్డుగఱ్ఱ కరానబూని
దెసలదోతెంచె, గుజరాతు ముసలిసెట్టి. ౩

సీమగుడ్డకు కన్నులు చెమ్మగిల్ల
ముతకబట్టకు మర్యాదపాటమరించె
నగరివెలుపలి మాలమాదిగలుగూడ
నరులుసుమ్మని దేశంబు గుఱుతుబట్టె. ౪

వెఱపువలదు నీకు హరిజన సోదరా
స్వీయరాజ్యరథము వెడలివచ్చె
లాగిపొమ్ము నీకు భాగంబు గలదంచు
బాడుచుండె రత్నభరతమాత. ౫

ఒకనాఁ డామునిపక్షి, తొంటి చెలికాఁడున్నట్టి గేహంబులో
నికి నేతెంచి యథావిధిం దిరుగుచుండెన్ మిత్రుఁడీక్షించి, యు
త్సుకతంబొంగిఁ దరస్మితంబున నిదే జోహార హాపక్షిణీ!
యకలంకంబగు నీ సహాయమున నాయర్థంబు పండాయెనే?

నా వర్ణించిన పుణ్యభూములను సందర్శించినావే? మహా
దేవుం డాయన దేవియుం దగిన యాతిథ్యంబు నీకిచ్చిరే?
నా వాక్కుల్ జెవినాటితే? మహితరత్న స్వర్ణకాంతిచ్ఛటా
దావద్దివ్యహిమాద్రికందర పవిత్రక్షేత్రముల్ సూచితే?

పుడమి కలుషరాశి మ్రుగ్గిపోవుచు నుండ
నాట్యమాడుకొనుట న్యాయమగునె
భర్గదేవ! సృష్టి పరికించి పొమ్మంచు
బిలిచివచ్చినావె? పులుగు చెలియ.

కాళిదాసుని మేఘంబు గౌరవంబు
తెచ్చుకొన్నది నీదు సందేశగాథ
ఘనులు చేకొను భూభృదగ్రముల పూజ
యసమ చతురత్వమున్న బానిసకు రాదు.

వ్యాస వాల్మీకిముని మదేభములు రెండు
దిరుగుచుండెనె? కైలాస గిరులమీద
వారి వార్ధక్యమున నీకు స్పష్టమగును
భరత రామాయణంబుల పడుచుందనము. ౧౦

ఆ వాల్మీకి నిసర్గజంతు కరుణావ్యాసక్తి యే సత్కవిఁ
గావించెన్ వెడలించె రామునికథా గాంగేయముం గానిచోఁ
త్రోవల్ గొట్టెడు బోయ కేఁగురువు నేర్పుం దివ్యగీర్వాణమున్
ఆవేశించి కళాధిదేవి వరమీయన్ విద్యలేమాత్రముల్.

ఎదురై వచ్చెను కాళిదాసుని లసచ్ఛృంగార సందేశ మం
బుధమార్గంబునఁ దద్రసంబులు ధ్వనుల్ ముత్యాలు వర్షించెడిఁ
బదినూరేండ్ల పురాణ మేఘమనుచున్ భావింతువో నిత్యముం
బదియారేండ్ల వయస్సు కూర్పదె సుకావ్యస్పర్శ జేజెమ్మకున్

జనముల్ మెచ్చు రసప్రసిద్ధమగు నా సందేశ భారంబుతో
జనముల్ సచ్చు విమానమాలికల గర్జాభీషణంబౌ ప్రభం
జన మార్గంబున నీప్రయాణమెటులన్ సాగించి నెగ్గించితో
వెనుకన్నేరవు గండముల్ తబిసిపక్షీజన్మ సన్మార్గులన్. ౧౩

కన్నులు ధన్యంబులుగా
కన్నావే మంచుకొండ గగనము శిరముం
దన్నెడు దాని సమరగవి,
వెన్నవలెం ధవళరుచులు బిందెడుదానిన్. ౧౪

కాందిశీకుఁడనెడు గ్రంథ మాయమ పేర
వ్రాసె నొక్క సుకవి, పరభృతంబు
తిక్కనరపువంశ దీపాల నిశ్చల
తేజమునకు నదియ గాజుకుప్పె. ౯

శాంతి రమావిలాసినులు, సఖ్యముదప్పక వాసముండు శు
ద్ధాంతము శ్రీసుదర్శనమహల్, కులభేద పిశాచరాజ మ
య్యంతికమందు కాల్గదుపు నర్హత లేదు, సుదర్శనాంబస
త్కాంతుని కంటిలో నసమతారస వాహిని పొంగిపారెడిన్. ౧౦

కరవై పోయిన సాహితీసభల నాకాంక్షించు, సర్వాంధ్ర సుం
దరి ఔఁదంబునఁ బాలుపోసి, కవిసన్మానంబు లేకేట నె
ల్లురి వీట న్నెలకొల్పినట్టి కవితాలోలుండు నీవాణికీ
శ్వరుఁడయ్యెం గడుధన్యురాలవు, మునీశ ప్రేయసీరత్నమా! ౧౧

శాంతిని కేతనంబనెడు చక్కని ధేనువు పాడిద్రావి మే
ల్సంతతి ప్రేయసీవిరహశల్యము వాపి ముదంబుగూర్ప, న
శ్రాంతము భారతాభ్యుదయ రమ్యదినంబులుగోరు మంజుల
స్వాంతునిఁ జెట్టబట్టిన లసత్కళికుం జలనంబు గల్గునే? ౧౨

భళిరా! సత్కవివన్నమాట నెపుడో భాషించె నన్నారదుం
డెలమిన్ మున్ మణికంధరోక్తులకుఁగానీ; యంతమాత్రాన, మే
ల్భళిరా! సత్కవివౌదువన్న నుడి సంపాదింతురే దుష్కవుల్
పలుకన్నేర్చిన రామరాడ్విభునిజిహ్వాన్ దచ్చి, పక్షీశ్వరీ

గ్రంథకర్త
జి. రాఘవ.

బహుదేశ మత మహాపరిషత్తు తలయూచ
పలికి వచ్చినది మా భరతసుతుఁడు
కండెబొట్టున నైదు ఖండాల నోడించి
కొలువులందినది మా కోమటన్న
సీమలో నాచార్య సింహాపీఠికమీఁద
నిలిచివచ్చినది మా తెలుగువాఁడు
విశ్వసన్మానంబు వెలయు నోబెలు కీర్తి
రంగ మెక్కినది మావంగసుకవి
చెట్టుచేమల సుఖ దుఃఖ జీవితములు
నిజము దేల్చినది మా నేలవాడు
నన్నుదొలగించి లెక్కించినారు గాని,
మొదట నెల్లర మన్నదమ్ములము మేము.

---

ఆకొండయే యుండియా విరోధులదండు
గుండెగాలంబైన వెంశికోట
ఆకొండయే ముత్తియపుదంట భారతో
ర్వీమాతృమణికిఁ గిరీటభూష
ఆకొండయే పర్వతాగ్రగణ్యములైన
కులపర్వతముల నిక్కులకునిక్కు
ఆకొండయే రాజతాచలస్వామికి
మణిమయ కల్యాణ మంటపంబు

సింధు గంగా మహానదుల్ చిన్ననాడు
ప్రాకనేర్చిన యపరంజి ప్రస్తరములు
పాదచిహ్నాలు పరికించి వచ్చినావె
కలుషములు వాయ, కన్నుల కఱవుదీర ౧౫

ఇంద్రధనువుబట్టి సాంద్రాబ్దవనవాటి
మెలగు చున్నవాడు మృగయుఁడొకఁడు
వాడు గొంతుబిసిగి వసుధపై విసరిన
జంతుతతులు నిమ్నజాతి జనులు ౧౬

అనర్ఘ ప్రతిభా సముద్రులగు శిల్పాచార్యు లూహింపగా
మూగంబడ్డ శకుంతముల్ పలికి సొంపుల్ గట్టి కీర్తింపగా
వేసంజామున రంగులద్దు నల శిల్పి బ్రహ్మ దేగ్రామమో
భోగట్టాగని వచ్చితే? రసమయంబుల్ తత్కళాపద్ధతుల్

బెళుకుంజూపులు గుల్కుపోకడలు చూపీనూపకూరించుచున్
జలదాగారములందునో చెవరు కన్యల్ కొందరీక్షించితే
పులుగుంజేడియ యబ్ధిగర్భములలో ముత్యాలుపండించి భూ
ములకర్పించెదరంట, మేటిగహానంబుల్ సృష్టిపై చిత్ర్యముల్ .

ఎంత కోయిలపాట వ్యర్థమయ్యెనో కదా!
చిక్కచీకటి వనసీమలందు,
ఎన్ని వెన్నెలవాగు లింకిపోయెనో కదా!
కటికి కొండలమీాద మిటకరించి,
ఎన్ని కస్తురిజింక లీడేరెనో కదా!
మురికితిన్నెలమీాద పరిమళించి,
ఎన్ని ముత్తెపురాలు భిన్నమయ్యెనో కదా!
పండిన వెదురు జొంపముల లోన,

ఎంత గంధవహాన మెంత తంగేటిజున్ను
యెంత రత్నకాంతి యెంత శాంతి
ప్రకృతి గర్భమందు ! భగ్నమైపోయెనో
పట్టరానిచోట బుట్టుకతన. ౧౯

నెలలోనున్నది వృద్ధురాలొకతె గాంధీ శిష్యురాల్నిచ్చలుం
జిలుగున్నూలు తయారుచేసికొనుచున్ జీవించు జేజెమ్మ, కొం
డలయల్లుండు శిరాననుంచుకొని సన్మానించెడిం బండువె
న్నెల పూదోటల విశ్రమించి మన సందేశంబు నాలించెనే.

నాచిత్తంబునసక్కఁ దోచ దెచట న్నాతల్లిరూపంబు ధా
త్రీచక్రంబున, దేహమూడ్చి నరు లుర్వింబాసి వైకుంఠమం
దో! చండీశ్వరుడుండు మండలమునందో! యుంపురంద్రెల్లరా
యాచోకీగని వచ్చితే మృతి భవిష్యన్మార్గముల్ విశ్వముల్.

చంద్రచండకరులు సన్మార్గ గతులయ్యు
నొకనిజూచి యొక్కరోర్వఁజాల
రెందు కింత వైరమిరువురిలో ద్రావి
డీ డెవండు? తెల్గువా డెవండు? ౨౨

పవలింపారెడు సృష్టిఁజీకటి సిరాపంకంబునంబుంపి యి
ట్టవమానించెడు కొంటెవాడెవడు ప్రొద్దల్లంత గన్పట్ట వే
కువ నేమూల నణంగియుండు తమ సిగ్గుంజేటు యోజింప రీ
యవివేకుల్, విరమింప రీ దినదిన వ్యర్థప్రయత్నంబులన్ ౨౩

శివుడు తాండవించి చేకొన్న సత్కీర్తి
తన ప్రయోజకత్వంబని తలంచి
విఱ్ఱవీగడంద్రు – పెక్కుఱు నటకులు
విఱ్ఱవీగి కవుల విస్మరింత్రు. ౨౪

వెలవాఱుచ్చగరాని భావముల నన్వేషించుచున్ సత్కవీం
ద్రులయూహల్ విహగంబులై తిరుగుచుండున్ బ్రోన్నతా
కాశమం
డలమస్తంబున నాకళించితె? ప్రయాణశ్రాంతి నమ్మించుకొం
డలకున్ డిగ్గడి, నీవి శేషము రసజ్ఞజ్ఞేయ మూహింపగన్.

వడుకునూలుచేత బగ్గాలు పేనించి
దొడ్డమృగయు డుచ్చు లొడ్డినాడు
తగులుకొనునో ! కాక తప్పించుకొనునొకో
స్వీయరాజ్య మనెడు సింహరాజు. ౨౫

నరులన్ ముట్టక నందులం గొలిచి పుణ్యంబెల్ల సాధించు న
ప్పరమంబైన రహస్యమున్ శివునితో ప్రస్తావముం జేసి తే
పరమేశుం డిది నిమ్నజాతులకు సంప్రశ్నింపగా గాని వే
దరహస్యాలని కోపగించుకొని స్వార్థంబుం బ్రదర్శించెనే.

పసుమంబు బూసికొని యే
రసికత లేకుండ బ్రదుకు ప్రమథుల నడుమన్
రసికుడగు సుకవి జీవిత
మసిధారా వ్రతము వలన నది శత్రులగున్. ౨౮

ఎవరికివారై బ్రదుకుచు
నవీన ధర్మములు పిచ్చి నమ్మకములతో
సవరించి ప్రజల తలలో
ప్రవేశ మొనరించు స్వార్థపరులంగంటే? ౨౯

దొరసుల్ మార్తురు కొందరాంధ్రులవురా, దేశాంతరం బేగి, వ
త్సరముల్ పుచ్చి, త్రివిష్టపప్రజలతో సఖ్యంబు గావించి యొ
ప్పారీకంబైన విదేశ నాగరకతో విచ్ఛేయ కచ్ఛాంధ్ర సుం
దర వేషంబు ప్రతిష్ఠ నిల్పితివి సన్మానార్హ మెంతేనియున్. ౩౦

చెప్పక చెప్పుచున్నది విశేషము లేదని నీ మొగంబు నే
తప్పొనరించి యింతటి వృథాశ్రమ మిచ్చితి మాయదృష్టముల్
దప్పిన దప్పని మ్మనుగుతమ్ముల శ్రేయము గోరి భర్గునిన్
గుప్పెడు గుండెతో నెదురుకొంటి విదే సదివేలు పక్షిణీ! ౩౦

అపజయంబులు విజయ గేహంబు నిలుచు
స్తంభములు సుమ్ము నీకు విచారమేల
కొద్ది కొద్దిగ నిక్కిన గోడవోలె
సగము సగములుగా పనుల్ ముగిసిపోవు. ౩౧

ఓటమి లేదు నా యతన మూరక పోదు తుపానువోలె నా
మాట లుమా మహేశ్వరుల మానసముం గదలించి తీరు, క
న్నీటము నింగి పైకుబుకు నిర్మల సూక్తి ఫలింపకున్న చో
రాటములో స్వరాజ్యము విరాజిలుటల్ కృతక ప్రచారముల్

పలనాటన్ మను బ్రహ్మనాయని కృపాబాహుళ్య నేత్రంబులో
పల నాటంబడి నాయురాలి కృతక వ్యాపార దావంబులో
పల భస్మంబయి సంఘసంస్కరణ దీవ్యద్బీజ, మీనాటికిం
ఫలియించెం గద? గాంధిచే, యతనముల్ వ్యర్థంబుగా వెన్నడున్

కావించిన రాయబారమునకు న్నిత్యాభిషేకంబుగా
నాకన్నీటిని కాన్కగా యొసగుచున్నానో దయాశాలినీ!
చేకొమ్మింతకుమించి నావలన నాశింపంగ లేదిట్టి నీ
బాకీదీర్త్తు స్వరాజ్య సౌధమున నావాసంబుసిద్ధించినన్. ౩౫

ఏజాతి కెంతవచ్చునో
రాజత్వంబంత నాకు రావచ్చుగదా?
నాజాతి యెత్తు కేతన
రాజంబున నీదుమూర్తి వ్రాయింతుఁజెలీ! ౩౬

పెల్లుతమస్సులోన దురపిల్లెడుమాబ్రతుకుం దమస్వినుల్
భల్లునదెల్లవార్చగల బాబులు పెద్దలనేకు లుండగా
డెల్లనివేల్పు భిక్షుకుని దిండికి బట్టకు లేని కొండరా
యల్లుని నాశ్రయించి యకృతార్థుడనైతిని పిచ్చివాడనై. ౩౭

మరచితి నాదిదేవుని సమానుఁడు బుద్ధునియంతవాఁడు భా
సురదరహాస చంద్రికల శుభ్రత లోన గలట్టివాఁడు, య
స్తౌరలకుగాదు వారి చెవిదూరినవారిని లక్ష్యపెట్టఁ డ
ప్పరమమునిన్ సబర్మతి నివాసిని జూచితివే తపస్వినీ! ౩౮

ముల్లోకించుక వాలిపోయినను బాపూజీకి దీక్షైన శ్రీ
వల్లాభాయి పటేలు దర్శనము సంప్రాప్తించెనే నీకు నే
డల్లంతన్ గనుపట్టుచుండెడు స్వరాజ్యార్థంబు సర్వస్వమున్
గొల్లంబెట్టిన త్యాగి తానత డెఱుంగున్ నా మనఃక్లేశమున్

ధిక్కారించెడు రాచగుఱ్ఱముల స్వాధీనంబు గావింపగా
యుక్కుంగళ్లెము జవ్వారుం డతని విద్యుచ్ఛారదామూర్తిన
ల్దిక్కుల్ నిండి నటించుచున్నదనుచున్ దేశంబు లగ్గించు మా
చిక్కుల్ దీర్చుటవిస్మరింపడుగదా? స్వేచ్ఛాజయాంతంబునన్

పసుపుం బచ్చని పూతపూచినది మువ్వన్నెల్ పిసాళింపఁగాఁ
గ్రొసు మందారమనంతశాఖకలునిక్కెన్ దిగ్దిగంతంబులన్
బసలేర్పడ్డవి సర్వవర్ణములకున్ దచ్ఛాఖిశాఖాతతిన్
వసియింపన్ మనకుండ దేస్థలము దివ్యస్వామి పత్నీశ్వరీ! ౪౮

కల దంబేత్కరు నా సహోదరుడు మాకై యష్టకష్టాలకుం
బలియై, సీమకువోయిక్రమ్మరిన విద్వాంసుండు వైస్రాయిమే
ల్కొలనందుంగలదొడ్డవాఁడతఁడు నీకున్ స్వాగతంబిచ్చి పూ
వుల పూజల్ పొనరించెనేయతనిమెప్పుల్ నీజయారంభముల్

నేను నా కను సహము ఖండింపలేక
పదియు నెనిమిదిశాస్త్రిలు పదునులుడిగె,
నీవు నేను సమత సంధింపగలిగె
తీవ్రతరమైన చిన్న మౌనవ్రతంబు. ౨౩

వచ్చినవారు నీమనరపాలురమంత్రు లభీప్సితార్థముల్
దెచ్చిరి ప్రేమతో భరతదేశజులం దనియింపవచ్చి పో
వచ్చు, స్వతంత్రభారత సువర్ణకిరీటము, నేడుగాక రా
వచ్చు మరొక్కనాడు నెలవాసినతొయ్యలి తీర్థమాడదే? ౨౪

గుడిలో దేవుడు చూచిపొమ్మనుచు నాకున్ వార్తలంపింపగా
దొడగెన్ నల్వురచేత నీవెనుకవత్తున్ నన్ను రమ్మందువా?
తడవైనన్ మరణింతురెందరొ విముక్తాహార దీక్షాపరుల్
నడుమన్, నేనుసహింపజాలనొకయాంధ్రప్రాణిశుష్కించినన్

గబ్బిలమవయ్యు శివుని లోకంబునందు
వలయుకదలిక గలిగించి వచ్చినావు
నిశ్చలంబైన కాసార నీరమునను
నలతి శిల చాలదే వలయములుదీర్ప. ౨౫

అర్థించి చనుదెంతు నగ్రహారముకన్న
సర్వేశ్వరుని యింటి చౌకదనము
అడిగివచ్చెద వీటి నడిబజారునకన్న
గుడిగోపురముల తక్కువతనంబు
పలికించికొనివత్తు బంతిబువ్వాలకన్న
తీర్థప్రసాదాల దేబెతనము
ప్రశ్నించివత్తును రాచబావులకన్న
పాతాళగంగమ్మ పలుచదనము

నిజము దేలిచికొనివత్తు నిన్న నేడు
నన్నుజూచిన నల్లంత నడుచుతనము
గుడికిరమ్మనినంతనే యొడలుమఱచి
పరుగులెత్తుట నాకంత పరువుగాదు. ౪౭

ఎంతోదూరము పోవనేమిటికి నేడింటింటికిం బ్రాకి యా
శాంతవ్యాప్తముగారహించెడు స్వరాజ్యస్వర్ణసూత్రంబు, చౌ
దంతిస్తంభన మాచరించెగద? యేతద్దివ్యసూత్రంబు, మో
కంతై నిక్కనకట్టివేయగలదా యస్పృశ్యతావ్యాఘ్రమున్.

చాటింపించి మదీయజాతికి నభీష్టంబుల్ ప్రసాదింపగా
పూటాపడ్డది కొంతభారము, రేపో! మాపో! రావచ్చు, సి
నాటంగాదని కొంతభారతము పంతంబొప్ప వాదించు సి
వోటెవ్వారి కొసంగితో తెలిపి నన్నోదార్పవే నచ్చెలీ! ౪౯

ప్రియములుగాని సత్యములు పెక్కులు నేను వచించుచుంటి, సి
దయకెడమై తపింతువొ! యథార్థ పిపాసువులైన వారి యా
శ్రయ కరుణావిశేష రుచిరాత్మ మనస్కుడవైన సుఖించెదనో
భయపడనేల నా పలుకుపల్కులు శాంపృక్షణాభిరామములౌ ౫౦

ఏకవి పిచ్చిగానడచు పృథ్వికి లోబడి కీర్తికోసము
ద్రేకము సంహరించుకొని దేశము వోయిన ద్రోవబోవునో
ఆకలి పేదమూర్తి మది దంబుజగర్భుని రాణిగారికిన్
సాకుడుబిడ్డ డాస్తిగల సామికి చేరసికప్రదానముల్. ౫౧

పుట్టంగావలె సత్కవీశ్వరుడు నీ పుణ్యాన మావంశమున్
బుట్టంజీలిచికొంచు సంచితకళా పూర్ణప్రభారాశియై
పుట్టంగూడదు పుట్టి సంగలుగ నెప్పున్ నిందసన్మానముల్
గట్టా! యుచ్చతనీచతాయుత వితర్క భ్రష్ట దేశంబునన్ ౫౨

పిడికెండన్నము బెట్టలేదెపుడు మా వేమన్న జీవించి న
ప్పుడు ముద్దుల్ మురిపించు మేలికవనంపుంబుగ్గలుప్పొంగి క
ఱడవుల్ మొద్దులు మోసులెత్తునపుడౌరా! నేడుగోరీపయిన్
నడచుంబూజలుపుణ్యకార్యములువింతల్ మాదయా
ధర్మముల్

బ్రతికియున్న నాయ బాబెన్నడునుగాడు
చావకున్న వట్టి నాయబయ్య
తిరుమ లేసుడైన తెలియడీ యర్థంబు
చావు బ్రతుకులోని సారమిదియ. ౫౮

సమతలు సఖ్యముల్ బెకవిజారినమాటలు కట్టుబొట్లు చ
ట్టములు పటుత్వమాడిన గుటారపుదూముడి బంధనాలు ధ
ర్మములు దయారసాల్ మొసలికాలుచు నగ్రుకణాలు చిత్రచి
త్రములు మతస్వభావములురాఘరగా వివరింపగల్గితిన్. ౫౯

ఇప్పుడు గుండురాతివలె నీశ్వరుడై ముడుపుల్ గ్రహించుకో
టప్పయొకానొకప్పుడు గృహస్థుడుమానవమాత్రుడైనరాల్
రప్పలు వేల్పులై సకలదాసులు మ్రింగక మిన్నకుండునే
యప్ప! పులుంగురాణి! యిక నాసలులేవు క్షుధార్తజాతికిన్.

మరణము వార్ధకంబను ప్రమాదమెఱుంగని కైతలల్లు స
బ్బురపుఁ గవీంద్రు రెడ్డికులముఖ్యుని వేమన చాకచక్యమున్
మఱచి పురాణకావ్యరసమత్తుడు పీడకు సంఘసంస్కృతి
స్థిరముగ రచించె నాంధ్రకవిజీవితముల్ బొరపాటుచేయుచున్

దొడ్డరాళ్ళగుండ్లు దొరలించి పతితల
బెదురుబెట్టు కవితవిస్తరించి
పండితులకుదక్క పరులకందకపోయె
దేవతలకు కామధేనువట్లు. ఆ॥

కవిత చచ్చుదయ్యె, గథ పేరుగలదైన
గవికి కొంతకీర్తి గలుగవచ్చు
నెలలు తక్కువైన బలమైనతిండిచే
నుసురునిల్పుకొన్న నిసుగువోలె. ఆ॥

వ్యాకరణశాస్త్రకారులు
జూకుఁ గకారంబు విరతిగన్పడదని చీ
కాకుపరతు రంతెకానీ
పాకము రసమింపుసొంపుఁ బరికించెదరే. క॥

వ్యవహారంబున భ్రష్టమయ్యు రసభావస్ఫూర్తిగల్పించి వ
ర్ధవముల్ శబ్దములెన్ని యోకలుగ శాస్త్రజ్ఞానమాత్రుల్ పు-
కవితోన్మత్తు లెఱుంగజాలుదురె కుగ్రామీణభాషాబ్ధిలో
జవులూరించు తెలుంగుపల్కుల జగాస్వారస్యరాహాస్యముః

కనుఁగొన్నావుగదమ్మ కృష్ణవిభు డక్కాలాన భాషావనం
బున సాగించిన యష్టదిగ్గజరథంబుల్ శారదావాహమున్
తెనుగుం దేశము విస్మరించినది తద్దిగ్దంతి దంతావళ
ధ్వని, యధ్వానపుటద్రిగర్భముల సిద్రంబోవు నాంధ్రత్వమున్

తెల్గు తేజంబెల్ల దిక్కులకెగబ్రాకి
పగవాని బెదిరించి వచ్చునపుడు
తెలుగుశిల్పుల సుత్తెదెబ్బ ఖంగున మోసి
చీనాకుపయనంబు సేయునపుడు
తెలుగుకవిత్వంబు దిగ్దంతులముఖాన
బృంహితధ్వనులు గావించునపుడు
తెలుగుజెండాశక్తి నలుదెసల్ ప్రసరించి
విద్యానగరవీధి వెలుగునపుడు

రామలింగని హాస్యకార్యములు దలచి
నాల్గుదిక్కులు కడుపుబ్బ నవ్వునపుడు
నాట్యమాడిన యానందనవ్యలక్ష్మి
కానుపించెనె? శిథిలదుర్గముల యందు.

అక్కట! తల్లికోట సమరాంగన యాఖరు తెల్గుపోటుచే
యుక్కిరి బిక్కిరై తురకయోధులవంకకు వాలునాడు భూ
భుక్కులగండడౌ తెలుగుభోజుని పూజలు చూరగొన్న యా
టక్కరిదేవతల్ తనువు డాచుటనాకు నసహ్యమయ్యెడిన్.

తొంబదియేండ్లవృద్ధుడతి దోర్బల భీముడు రామరాజు డెం
తెం బరగండడౌ నృపమణీ సుత భర్త, మహమ్మదీయ ఖ
డ్గంబులకున్ శిరంబొసగి కష్టముదెచ్చినమాట ఆంధ్ర వ
ర్గంబు సహింపనేరని పరాభవమై భవమై దహించెడిన్. ఉ॥

తెలుగులండను నగరంబు తెలుగుకోట
తెలుగుకవి దిగ్గజంబులు, తెలుగుదనము
పొట్టిగుఱ్ఱము నెక్కిన పొగరుబోతు
టళియరామునికతన, ముక్కలయిపోయె.

గబ్బిలము

విహారింపనేభీతి విడిచి మస్తమునెత్తి
సకల సామ్రాణ్మహా సభలలోన
వాక్రుచ్చ నేరాలు వగిలి బుగ్గలుజిమ్మ
నతి నిశాతప్రబంధాదికములు
కల్పింప నే తెల్గు కళ్యాణికొప్పున
సొగసైన కీరితి పొగడదండ
ఎత్తింపనేమేటి హిమవద్గిరులమీద
శాశ్వత విజయ రాష్ట్రధ్వజంబు

పగరగర్భకుహరిస్వారిగావింప నే
యింటి గుట్టు బయటి కెక్కకున్న
సమ్మతించి జాతి కుమ్మక్కుగానున్న
కొండలన్ని పిండి గొట్టనొకో ౬౭

అది మారత్నము లారబోసికొను విద్యాశారదాపీఠ మల్లది మా కత్తుల ఖారుకానమది యాంధ్రాదిత్యబింబంబు సంపద సొంపారిన మాల్యవంతమని డంబంబొప్ప చాటించు సమ్మదసౌఖ్యంబొక తెల్గువీరునకె సంప్రాప్తించెముమ్మాటికిన్.

కలవెన్నో విషయంబు లాంధ్రుల కళాకౌశల్యముల్ సాటుతా
వులు ప్రత్యర్థులగుండెలో వెఱపు నిప్పుల్ సల్లు గాథావళుల్
కలవిప్డున్ బలనాటిపౌరుషపురేఖల్ మాశరీరంబులన్ ౬.
కలుపుంగోలుతనంబులే దది కళంకంబంద్రుమాజాతికిన్.

ముసలిమానులలోని యనమసమత్వంబు
లంగోటిగట్టి చెలంగుచుండ
ఘూర్కాసిపాయీల కుటిలశౌర్యజాల
నట్టింట కాపలానడుపుచుండ
ద్రవిడుల కార్య సాధన, ధనార్జనదీక్ష
సాంబారు నోరెత్తిచాటుచుండ
రాష్ట్రాంతరములకు బ్రాకి హిందీభాష ౬౦
పదుగురినోళ్ళలో నెద్దుగుచుండ

అఖిల దేశములను నవతంసకుస్సుమంబు
రాజితోగ్రదనర క్షత్రిలక
మాన ధనికురాలు, మా తెల్గుతల్లాలు
కలత జెందదౌర కాలమహిమ! 27

గబ్బిలము

గౌతమిగంగలోన మృణకాంతులతో నుదయంబుగన్న వి
ఖ్యాత ఫణీవితానము మహమ్మదురాజుల దండుదెబ్బతో
తాతలనాడ పోయె నిక తాతలుబుట్టినరావు, రత్నదీ
పాతత కాంతులీను గృహమక్కట నూనెకు దేబెరించెనే.

రతనాల్ దొంగలు దోచుకున్న పురుష శౌర్యశ్రీలు విద్రోహింభూ
పతులేశేటట మృదుక్తి చాతురులచే బంధించునాడేస, భా
రత చండీశ్వరికోటిహస్తముల దర్పంబుం బ్రదర్శింపదో!
ధృతిహీనంబగు భిన్న భిన్న మత విద్వేషంబు పాటించెనో!

గప్పాల్గొట్టిన నేమిలాభము ధరాగర్భాన నిద్రించు కృ
ష్ణప్పల్ దాతలు లేచివచ్చెదరె వీరావేశవిభ్రాజితుల్,
నిప్పుంబోలు తెలుంగువీరు లిపుడున్ జీవించియున్నారలీ
చప్పంబడ్డ యనుంగు సోదరుల కుత్సాహంబు సంధింపగన్.

ఏనాడు మా కావ్య సృష్టికర్తల జిహ్వ
విశ్వసత్యము నాలపింప గలదో!
ఏనాడు మా జాతి దృష్టి మాంద్యమువాసి
చుట్టుప్రక్కల దేరి చూడగలదో!

ఏనాఁడు మా బుఱ్ఱ లీ జుట్టు తలలేని
పుక్కిటి కథలలో జిక్కువడవొ
ఏనాఁడు మావిద్య లినుపసంఘమునందు
చిలుముపట్టక ప్రకాశింపగలవొ ౨౭

తనువు దాచక సోమరితనము మాని
యెన్నడీమతంబులు బిచ్చమెత్తుకొనవొ
అట్టిశుభవేళకైన కొంగుబట్టి నిలచి
నలిగి వాపోవుచున్నది నామనస్సు. ౨౮

ప్రభువుల పెండ్లి పేరంటాలు వర్ణించి
కాలంబు పెక్కేండ్లు ఖర్చుపెట్టి
విరహవేదన మేనుమరచి మూర్ఛిలువోవు
రాణివాసంబును రచ్చకీడ్చి
అంగాంగ వర్ణనా వ్యసనంబు రెట్టింప
యువకజీవిత కోటి కుచ్చులొడ్డి
పదియునెన్మిది మార్లు బాడిన శ్రీరాము
చరితంబు నగరెక్క తిరుగబాడి

శరణు శరణటంచు బరుగులెత్తుచు వచ్చు
నార్తలోకరుత మనాదరించి
భువన హితముగోరు కవితాకళాశక్తి
స్వార్థజడధి నూరవైచినారు. ౭౬

పెద్దలశల్యముల్ బలె వివేక మొసంగని గ్రంథరాసులే
విద్దియలైన నింక బదివేలయుగాల్దలకాయలేని గం
గెద్దులు బుట్టి సార్థపరులెత్తిన గంతలుమోసి తీరెడిన్
బుద్ధి చిగుర్చునే యరుచి బుట్టుకథల్ దలమీదరుద్దినన్. ౭౭

ఆడుది లేకయున్న గృతికందములేదని నమ్మి యెన్నఁడో
పాడి రనుత్తమ ప్రణయ బంధురగీతము లర్థతృష్ణ వె
న్నాడకవుల్, మహీపతి బృహన్నల వర్గము సంతసింప, నీ
నాడురచింతు, రిద్ధకరుణాపరిణద్ధ రసప్రబంధముల్. ౭౮

మొన్నటియుద్ధదేవతలకు బుట్టినకూతురు క్షామదేవి మృ
ష్టాన్నముగా భుజించిన క్షుధార్తుల డొక్కలు శల్యరాశి, సం
పన్నుల వీధులందు గనుపట్టెనె? వంగకవీంద్రకోటి చే
కొన్నకలాలెటుంగవనుకొందు దయారస నవ్యకావ్యముల్.

చలిచీమం బొలియింపనేరని యహింసానిమగ్నుల్ జాలలో
మొలిపించెం బహుబుద్ధవిగ్రహచయంబుం భారతం బంతటన్
కల్లైపోయెనొ తత్కృపాగుణముబంగాళంబులోఁ బ్రేమమూ
ర్తులు లేరో భుజియింపరో ద్రవిణవంతుల్ మేలిమృష్టాన్నముఁన్.

ఎట్టునశించిపోయె నితరేతర విశ్వాసనంబు లెందుకీ
చట్టములుం బ్రమాణము లసార మషీరస పత్రలేశముల్
కొట్టినగొట్టుమం చెదిరి గుండియలం గరగించు ధర్మముల్
బుట్టినగడ్డలో నకట ఫూత్కృతిసల్పు నశాంతిసర్పముల్.

అనఘం డశ్రు మషీజలంబున వివేకానంద సన్యాసి, వ్రా
సినవ్రాతల్ దడియారలే దిపుడు ప్రాచీనంపు టజ్ఞాన బం
ధన విచ్ఛేదమొనర్చి యే ఘనుడు విద్యాభిక్షగావించి, వ
చ్చని బంగారమునంటి మా భరతసంసారంబు నెగ్గించునో!

గాలిందూలెడు శుష్క దేహములతోఁ గాషాయవస్త్రాలతో
శూలంబుల్ సారకాయబుఱ్ఱలు జటాజూటంబులుం దాల్చి యా
మూలాగ్రంబుగ భ్రష్టులైతిరుగు బాబుల్ దొడ్డగంజాయి భా
యీ లున్నా రెదురైనవారె మునిపక్షీ! కుక్షిరక్షాపరుల్. ౭౨

జపమో ధ్యానమో! యభ్యసించి యతివేషంబూని క్రీడించు మో
సపు బార్థుల్ ప్రతి పల్లెటూర గలరీ సన్యాసి వర్గంబు నీ
కుపదేశింపదొ! యిష్టసిద్ధికని మాయోపాయ మంత్రంబు, భ
క్తిపరత్వంబాక సాధనం బిహ పరస్త్రీవంచక శ్రేణికిన్ ౮౪

పాలుం బండులు, కందమూలములు మాభక్ష్యాన్నముల్ గోరమే
కాలం బన్యపదార్థముల్ రజతమో బంగారమో కొద్దిగా
జాలున్ మాకని సేకరించెదరు గోసాయీ లుపాయాలు మో
సా లెన్నెన్ని నిరంతరాయముగ రాజ్యంబేలు నేడెల్లెడన్ ౮౫

వృత్తుల్ సర్వము త్రుప్పువట్టి చనగా భిక్షాటనంబుల్ జగా
వృత్తుల్గా, పలుజాతులై నిలువ దుర్భిక్షంబు రాకుండునే
యుత్తుంగాశయు లెందరో కలరు దేశోద్ధారకుల్ పూనరీ
చిత్తంబేర్చు కళంకమున్ దుడిచి సుశ్రీనేలకుంగూర్పగన్ ౮౬

ఎన్ని సుక్షేత్రములు సార మిగిరిపోయి
ముండ్లతుప్పల బంజరభూములయ్యె
దృఢతరంబైన యెంతెంత దేహశక్తి
భిక్షుకులమేన జీర్ణించి పృథివి గలిసె. ౮౭

పదవులు పీటలెక్కి యనువారము లంచపు బాడిబత్తెలం
బిదికి గడించి కార్మికుల పేదల చెమ్మట దెచ్చి కాన్కలి
చ్చెదరు సహోపజీవులు విచిత్రపు భక్తులు వేషధార్లు నీ
కెదురయివచ్చిరే వలదిసీ చెయిసాచకుమమ్మ పక్షిణీ! ౮౭

నరునికష్టపెట్టి నారాయణునిగొల్చు
ధర్మశీలురున్న ధరణిమీద
కాలుమోపలేక గబ్బిలమొక్కటే
చరణయుగళి దివికి సాచి నడచు.

పూజారి బోషాణమును కాపలాకాయు
చిల్లరి వేల్పుల సేవజేసి
గోత్రపోతులవల్ల జుట్టి గట్టునద్రేచు
కరకు సత్తులకు జాతరలు సల్పి
ఏటేట పెండ్లి జేయించుకొంచుదయించు
కృతక రాముల పల్లకీలు మోసి
నిలువుదోపిడి చేసి తలకాయగొరిగించు
యేడుగొండలవాని మేడలెక్కి

అంబుధీశుని కళ్యాణములని తలంచి
ముంచుగంగమ్మలకు డబ్బుపోసి పోసి
పాతకమువోలె నావెన్ను వాయకున్న
గోచితో నిల్చియున్నాడ పేచకంబ.

గుఱ్ఱాలకు ఱెక్కలుగల
వెఱ్ఱియుగాల్ దాటిపోయె, విజ్ఞానంబున్
బుఱ్ఱగల గాంధియుగమిది
కఱ్ఱలు ఖడ్గంబు లేలగా లేవు ప్రజకు

రాజుగారిగుఱ్ఱాల రథచక్రములక్రింద
మరణించు రైతుకు శరణమిచ్చి
నరజాతిలో, ననంతరములుండుటకన్న
నఘము లేదను ధర్మమాకళించి
బహుమతాచార దుర్భర పదాహతిచేసి
అసురుసురగువారి కభయమిచ్చి
రాజభాషలకన్న రాష్ట్రభాషలలోన
రసమున్నదను యథార్థత నెఱింగి

యుగయుగాలనాఁడ యూఁబిలోఁటఁగబడ్డ
మహితమైనజాతి మత్తగజము
ప్రబలదాస్య నిగళబంధంబు లగలించి
దెసల మసలుచున్న దినములివ్వి ౯౨

కలరే మోసపుదేశభక్తిపరులక్కైలాసదేశంబునన్
చలికిం ఖద్దరుధారులై యవల స్వేచ్ఛారాజ్యభాగంబు రా
గలదంచున్ విహరించుపెద్దలు? పతంగస్వామినీ! నిమ్నజా
తులపై వీరు నెలార్చు బాష్పములుచిందున్ దియ్యగావుల్లగా!

మా దౌర్భాగ్యప్రజాతిలోన నొకనిం బాధింపకున్నట్టి యీ
యాదివ్యాధికి నగ్నమైకుములు ఛేలా! నాకుఁ బోనిమ్ము నా
చేదస్తంబిది కష్టపెట్టితిని పక్షీ! రోషగాడెన్నడున్
బ్రాదుర్భావమునందరాదు పరసేవాభ్రష్టవంశంబునన్ ౯౩

కలదమ్మా ప్రణమంటరానితన మాకర్ణింపుమీ యిండియా
పొలమందుగల మాలమాదిగలకున్ భూతేశుడే కాదు కృ
ష్ణులు, కృష్ణున్నిరసించు దైవములు క్రీస్తుల్, మస్తుగా బుట్టెనన్
కలుపన్నేరరు రెండుజాతులను వక్కాణింప సిగ్గయ్యెడిన్. ౯౪

చాకిరిం జేసితిం దెలుగుజాతికి నేబదివత్సరాలు నా
వాకిలి ద్రొక్కి చూడవు శుభంబులు సౌఖ్యము లెంతకాల మీ
బాకి, వయస్సుతో నడుగుబట్టిన యాసలు తెప్పరిల్లునో
లేక, నశించునో, తెలుపలేవుగదా మదనాగవైరియున్. ౯౪

శుభశిశువో! యదిగాక య
శుభశిశువో తెలియరాదు క్షోణీసతికిన్
ప్రభవించు బిడ్డ యకటా
యభంగుర ప్రసవబాధ కగ్గంబయ్యెన్. ౯౫

అరవంగుత్తుక నోసి జంతువుల గర్భాగారముల్ జీల్చి నె
త్తుర టేళ్ళ నటియించు మూఢతమజాతుల్ జాతరల్ సేయ, జూ
తురు, చూపింతురు ప్రోత్సహింత్రు తతివాదుల్ శాస్త్రసారం
గతుల్
కరుణల్ కమ్మనిబోధలో పులుగుటక్కా! ఛీ! హుళుక్కుల్ గదా?

కనిగంగార్పణమంచు ద్రోసిచనియెం గర్ణున్ బృథాదేవి, యా
తని విద్యాకులరూప సంపదలు వ్యర్థంబై ప్రలాపింపవో
కనియెన్ భారతకుంతి మమ్ముల నసంఖ్యాకంబుగా కర్ణులన్
మునిపక్షీ! యమనందనుల్ తెలియరిప్పున్ మాదు
భ్రాతృత్వమున్.

ఒకడు రుద్రాక్షమాలికలు నెత్తికిజుట్టి
శివమూర్తియై భూమికవతరించు
ఒకడూర్ధ్వపుండ్రంబు లురువుగా దగిలించి
శివలింగమునుజూచి చీదరించు
ఒకడు రెండునుగాని వికటవేషముదాల్చి
పై వారిమీద సవాలుసేయు,
ఒకడు గంజాయిదమ్మునకు దాసుడై పోయి,
బూడిదగురవడై పుట్టినచ్చు

మనుజులార మాది ఘనమైన మతమని
ఒకడు తరిమితరిమి యుగ్గడించు
పెక్కుమతములిట్లు పేచీలుసాగింప
మార్గమేది యైకమత్యమునకు.

మొక్కుబళ్ళ నెపాన చక్కని పసిపాప
లెందరు గంగలో నిమిడినారొ
సహగమనాచార దహనదేవత లెన్ని
చిగురుగొమ్మల బూదిచేసెనొక్కొ

బ్బి అ ము

చదువుదాచెదు మరాచరణమొందరి కళా
భ్యసనచాతురి గొంతుబిసికెనొకొ
పొందెరుంగని వేఱుబందాలచే బహు
బలమెంతగా చచ్చువడియెనొకొ

చిలిపిరాలకు నగిషీలు చెక్కి చెక్కి
కాలమెంత యుగంతాన గలిపిరొకొ
చదువనేర్చిన వెఱ్ఱిసి జంపగలరె?
ఒక్కబుద్ధుడు నొకక్రీస్తు! ఒక్కగాంధి!

శిలనంటి యూరిసత్తులకు నెత్తుటికూడు
రేపుటిమాపులు మేపలేక
'ఆచారమని! తప్పదని' వెంటబడివచ్చు
గురులదక్షిణ లిచ్చుకొనగ లేక
మంత్ర తంత్రముల సోమరిమాంత్రికుల బారి
బడి ధైర్యమును చిక్కబట్టలేక
శతసహస్ర క్రూరమత సింహములు సేయు
కుటిలగర్జకు తట్టుకొనగ లేక

అనుగు తమ్ముల సిరు లోర్చుకొనగలేక
పిచ్చిపూజల మమతలు విడువ లేక
అమరనుతమైన మాదు దేశాభ్యుదయము
యుట్టికిని స్వర్గమున కెక్క కూగులాడు. ౧౦౧

విందుభుజించి పొమ్మనుచు బిల్చుటకర్హతలేదునాకు క
ర్మంది పతంగినీ! పనికిమాలిన సంఘము సమ్మతించునే
పొందులు పొత్తులు న్మనకు ముప్పదిమూర్ల కులాలవారికిన్
నందులనాగులంగొలిచి నవ్వులపాలగుచున్న జాతికిన్. ౧౦౨

స్వయముగ నన్నపూర్ణ తనభర్తకు సిద్ధముజేసియున్న య
వ్యయరుచిరాన్నమున్ శివునిపంక్తి భుజించిన పూజ్యురాల! వ
న్యయము తరించె నిట్టి మునిపక్షిణివై, కులభేదబుద్ధిచే
కయికొనకుండ వేసఖులగర్భదరిద్రులయాతిథేయముల్. ౧౦౩

తులవాక్రుచ్చగరాని నెత్తుటిసిరాతో వ్రాయుచున్నారు మ
త్కులజుల్ దుఃఖరసోత్కటంబులగు పెక్కుల్ గావ్యముల్
జాతి లు
బ్ధుల వజ్రస్థిరచిత్తముల్ గరగి, సంతోషించునో, యాప్పితం!
బులుపండింపక నుంకుతో సమసిమామూల్ త్రోవలంద్రొక్కునో

కవిగారికిదె నమస్కారంబ నేడు వాడు
కళకు లెమ్మని పరోక్షమున బలుకు
కవనంబునకు మేను గరగి మెచ్చినవాడు
కవిచెంత నెఱబెఱికముగ మసలు
విద్యా కళంకంబు వెదకజాలనివాడు
జాతిలేదని నోరు చప్పరించు
శ్రోత్రియులకు సహస్రములు బోసినదాత
అన్యుల మధుర వాక్యములదనుపు

జీవకళలు చెక్కు శిల్పిని నిరసించి
శిల్పమునకు పూజసేయునట్టి
వక్ర చరితులైన వ్యక్తులు గలచోట
కళలకకట! ప్రేత కళలగతులు. ౧౦౫

పోటీసేయ సమర్థులయ్యెదరె మా ముక్కన్నతిక్కన్నతో
మేటుల్ షేకుసుపీయరుల్ బయిరనుల్ మిల్టన్లు గోల్డుస్మితుల్
నాటైనారు స్వకీయులైన కవు లీనాడన్యభాషాకవుల్
నేటై రక్కట! కాలమాంత్రికుని పాండిత్యప్రభావంబునన్.

జాతీయోద్యమ యుద్ధరంగమహితోత్సాహ ప్రతిధ్వానముల్
కూతల్ బెట్టుచు నాల్గుజాతులకు గగ్గుర్పాటు గల్పించె.సేన్
స్వాతంత్ర్యంబను స్వర్గసౌఖ్యమున మా భాగంబుమాకిత్తురో
ఖాతా లేదని త్రోసిపుచ్చెదరో! వక్కాణింపవే చెల్లెలా! ౧౦౮

కలధౌతాద్రిగుహల్ ప్రతిధ్వనులెసంగన్ దెల్గు రాష్ట్రార్థమై
గలభా లేచిగి సోదరాంధ్రజను లాకర్ణింపవో నీవు? చె
ల్లెలరాష్ట్రంబు గడించినారనుచు హాళిం దేలితో! తెల్గు బి
డ్డల యత్నాలనరాదుగాని యవి సోడాబుడ్డి యుద్రేకముల్.

బలియైనాడు ధరాహితార్థము మహాభాగుండు యేసుండు త
త్ఫలితంబై కనుపట్టు భిన్నమత సిద్ధాంతంబులుం జీలికల్
కులముల్ గుట్రలనైకమత్యములు చిక్కుల్ జీదరల్, రిత్త
బోధలు వేదాలు పదాలు రాళ్ళు పరచేతన్ముక్తి ముక్తామణిన్

భోగు లాహారించు భుక్తికన్నులజూచి
పరమ పేదలు దుఃఖపడని చోటు
సాంఘికాచార పంచాస్యగర్జనమున
బెదరక జ్ఞానంబు పెరుగుచోటు

గబ్బిలము

జాతివైషమ్య రాక్షస పదాహతిచేసి
కందకళలు వెంపొందుచోటు
పరిపాలక క్రూరతర కరాసికి లొంగి
పోక స్వేచ్ఛాలక్ష్మి పొదలుచోటు

అనదబిడ్డలుజూడ నెయ్యంపుసుతుల
ముద్దులాడని గుణనిధుల్ బుట్టుచోటు
చెప్పగదవమ్మ చూచివచ్చితివె నీవు
నిశ్చయంబుగ వాసముండెదను నేను. ౨౦౦

పయిపై నవ్వులుపల్కరింపులుమృషాబాంధవ్యముల్ సూపియా
పయిశత్రుత్వముసేయు నాగరకతా భ్రష్టస్వభావాధముల్
సయితానుల్ చరియింపనట్టి ధర గోష్పాదంబు గన్పట్టినన్
దయతో నాకెఱిగింపుమమ్మ యచటన్ నాయిల్లు గట్టించెదన్

కళలందాచెడు చుప్పనాతితనమింకం దేశమందున్నచో
కలదే ముక్తి, ప్రపంచసభ్యతకు మార్గంబుండునే జాతికిన్
తలయుం దోకయులేని తొంబది సమాధానంబులం జెప్పి పే
దలవంచించు కళానిహంతలె యనర్థం బీ శుభక్షోణికిన్.

అసుశక్తిం బనిసేయుచున్ మసలు దేహాపూర్వయంత్రంబులో
బిసలెన్నోకల వే నెఱుంగనివి నా విజ్ఞాన భాండారపుం
బస లెల్లం బనిసేయ వింతలిసురల్ పాడైనచో, యెవ్వఁడీ
బిసగాఁడెందులకీ రహస్యములకున్ బీగంబు బంధించెనో.

అచ్చెరువున్ ఘటింపగల యంత్రములం గనుగొన్న జ్ఞానులుం
జచ్చిరి చావుపుట్టువుల జాడ లెఱుంగ కెతెంగి దేవతల్
జచ్చిరి మృత్యువుం గెలుచుశక్తులొసంగని చుప్పనాతి వే
ల్పెచ్చట డాగినాఁ డతని కెందుల కీ తెరచాటు మోసముల్.

మును మేనూడ్చిన వారియెమ్ము లెరువై భూదేవి పండించి నిం
చిన నానా ఫలవృక్షరాజముల కిచ్చెన్ దివ్య మాధుర్యమున్
తను రక్తంబును మేఘమై కురిసి యానందంబు గల్పించు చ
చ్చున దేదీ? ప్రతిజీవియుం దిరిగి వచ్చుం భిన్నరూపంబులన్.

మరణితులైన వారితనుమాంసము కొన్నియుగాలు భూమిలో
మురిగి రసాయనప్లుతల పూర్ణ పరీక్షల నిగ్గు దేలి యా
ఖురుకు, శిశూత్కరాదులకు గాయముగా విలసిల్లకున్న నీ
సురుచిర దివ్యకాంతులు నిసుంగులు మేన రహింప నేటికిన్.

ఆజన్మంబు తపంబునం బెరిగి దేవావాస వాస్తవ్యవై
పూజాపద్ధతులెల్ల నేర్చితివి, నీ ముత్తాతలుం దాతలున్
జేజేమ్మల్ కులసంఘ బాహ్యులయి కష్టింగుందుచో దేవతల్
రాజీపెట్టిరె? పేదవారి మొర కర్ణక్లేశ మెవ్వారికిన్.

మాతృభాషల కర్ఘ్య మర్యాద లొనరించు
సర్వకళాశాల సాగుచోటు
ప్రజలనాహరించు బహుమత దేవతా
దైనందినగ్లాని లేనిచోటు
నవనీతనిభమైన కవుల కమ్మని వాక్కు
వెఱపులే కావిర్భవించుచోటు
సంతానమునకు వైషమ్యంబు నేర్పని
తల్లిదండ్రులు విరాజిల్లుచోటు

విసపునవ్వులలాహిరీవేషగాండ్ర
పాదచిహ్నాల మరక లేర్పడనిచోటు
తోడునీడయు లేనట్టి దుర్బలులకు
గబ్బిలపుచాన వాసయోగ్యంబుగాదె? ౧౧౮

జాతీయపౌరుషజ్వాలన మాబాల్యంబు
నవరించు కావ్యరాజములు లేక
విక్రమక్రమశిక్ష వెన్నతోనిడు జిజా
సతివంటి మాతృదేవతలు లేక
ఒకజుట్టు నొకబొట్టు నొకకట్టుబడి నేర్పి
పాలింపజాలు దేవతలు లేక
కులమెల్ల చెదరి తెంపులు తెంపులగుచుండ
వారించి కాపాడు ప్రభువు లేక

బుద్బుదంబులకైన నైన మూడునాళ్ళ
పదవులకు ప్రతిష్ఠలకునై ప్రాకులాడి
నరులనమ్మించుకొన లేక నమ్మలేక
చిదికియున్నవి మాజాతిజీవితములు.

ఆసల్ చెప్పుదు రిప్పుడుం గురులు ముం దాకాశసింహాసనా
ధ్యాసీనత్వముసంఘటించునిదిసత్యంబంచు నూహింతు రీ
బీసీనాటి పురాణగాథలు రుషావేషంబుతగ్గించి నా
దాసత్వంబుస్వీకరించెను పరంధాముండు నాకేటికిన్. ౧౨౦

పుట్టుకపూర్వ మేతలను జంపినజాతి మతప్రచండ సం
ఘట్టనజేసినా సహజకౌశలముల్ నశియించిపోయె నీ
కట్టినకట్లు విప్పనధికారము లేని గురుండెవండొ యీ
యుట్టికినెక్కలేని ననునూచెడి నంటరికంపుడోలికన్. ౧౨౧

ననుసృష్టించినవాడెనా వెనుకజన్మంబెత్తునే నోరెఱుం
గని నన్నీ పదిరూపములతో కంగారుగావించునే
కనకంపుంగుడి గోపురాల్తనకు నాకాంక్షించునే? కానుకల్
గొను నే! యిట్టివిమోసగాండ్రయినభక్తుల్ పన్నుపన్నాగముల్

అనినమాటను మార్చుకొనలేని శాస్త్రముల్
స్వాభిమానముదక్కి పలుకగలవె?
కులముంచుకొని నన్ను గొలుచుకొండను వేల్పు
కడగి నాకన్నీరు దుడువగలడె?
మానవదాస్యంబు మరగినలోకంబు
నెనరూని నా చెల్మి నెఱపగలదె?
అస్వాభావికథావ్యాసంగ హాతమైన
పృథివి సత్యంబు నూహింపగలదె?

యుదుకుర క్తమెన్నడో చచ్చుబడిపోయి
చేతులెత్తి మ్రొక్కు స్వీయజాతి
కళకువీరసూక్తు లరిగించుకొని వేచి
యెదుటనిలిచి పగర సదమగలదె? ౧౨౩

ధర్మసంస్థాపనార్థంబు ధరణిమీద
నవతరించెదనని నబ్జభవునితండ్రి
మునుపుజన్మించి నెత్తికెత్తినది లేదు
నేడుజన్మింపకున్న మున్గినది లేదు ౧౨౪

కనుపడలేదు దైవతముగాని పదార్థము భాగతంబునన్
గనుపడలేదు సత్కులముకన్న మహాకళభారంబునన్
కనుపడలేదు వర్ణమునకన్న పిశాచము భారతంబునన్
గనుపడలేదు పంచమునికన్నను నీచపుజంతువేదియున్.

హక్కుల్ దొంగలుదోచుకొన్నను మనుష్యత్వంబు జంతుత్వమై
చిక్కుల్ పెట్టెను కాలమందును క్షమాసిద్ధాంతముల్ నేర్వనా
పక్కాపౌరుష నహ్నినార్పుమత రూపక్రూర సింహంబు నా
ప్రక్కంబండులునూరుచున్నదితలంపన్ శల్యసారథ్యమై ౧౨౬

జగముల్ మెచ్చ బియే లె మేలుబిరుదుల్ సాధించినామంచు నీ
లుగుమాలాలుమాదిగల్ గులమహాలోభంబు రెట్టింపగన్
తెగలంగట్టి తగాదలెంచెదరు గానీ సంధి గావింపరో
ఖగభామా! మతబోధలేల కుల కత్యాభ్రష్టదుర్జాతికిన్.

అసలే ముక్కిడి దానిమీద పడిసెంబన్నట్లుమాజాతి బా
నిసలారా! కలహించుచుందు రుభయుల్ నీచోచ్చతానిర్ణయ
వ్యసనవ్యగ్రత సిగ్గుచేటగునయోయస్పృశ్యతాత్రాసమం
త్రసమేతుండగు గాంధినేరడిపి యంతర్నాటకారాటముల్

భీతింగొల్పెడు నస్వాభావిక కథావేదాంత శాస్త్రాలకుం
జేతుల్ మోడ్చు నమాయకప్రజలు సంసేవింపభోగాబ్ధిలో
నీతల్ గొట్టు కవిప్రకాండముల సాహిత్యప్రపంచంబులో
ప్రాతఃకాంతులు జిమ్మునట్టికవితాభానుండుజన్మించునే. ౧౨౯

నటకునివోలి కాలపరిణామవిధేయులై రహించును
త్కటమత ధర్మశాసననికాయముతీరుపుచేసి సంఘ సం
కటముల పాలొనర్చి యధికారము సేయు దరిద్రజాతిపై
కటకటనల్వురాడు నెడ కల్లయథార్థము గాకపోవునే. ౧౩౦

రచ్చలకెక్కనీక సమరంబున బూడ్చిన కర్ణశక్తి నే
డెచ్చటజూచినం బ్రభవహించి సముజ్జ్వలమై వెలుంగదే
కచ్చ లసూయలుం గళనొకానొక కాలముడాచియుంచినన్
హెచ్చితురంగలించి ధ్వజ మెత్తకపోదు యుగాంతరంబునన్

కవ్వడి పరువున్నిల్వగ
నవ్వసుదేవాత్మజాతు డట్లనెగా నీ
కవ్వడి కర్ణుని గెల్చుట
నవ్వులపా టనెడుమాట నల్వూరెఱుఁగరే ౧౩౨

వలదన్నన్ వెనువెంటనంటి నను నిర్బంధించు వే
ల్పుల సిద్ధాంతములెల్ల నా సహజసంపూర్ణ ప్రతాపంబు లో
జిలికెం జిక్కని చచ్చుచుందు మునిపక్షీ! యింక నీవంటి గ
బ్బిలముల్ సేయు హితోపదేశములు వేవేల్గాలికాహారముల్.

అగుపించె నే యహంకారాదుర్గుణజ్వాల
సంహరించెదు శాస్త్రసముదయంబు
పరికించితచ్చితే పరమతసహనంబు
భాషించు వేదాంత పాఠశాల

వీక్షించితే వర్ణభేదాల వ్యాధిచే
శాంతిగా రాజ్యంబు సలుపు నెలవు
కనుగొంటివే మనుష్యునిజూచి మనుజుండు
మిట్టిమీనై పాటునట్టిసీమ

నేను చిందులాడి నేను డప్పులుగొట్టి
యలసి సొలసి సత్తికొలుపు గొలువ
ఫలితమెల్లనొరులు భాగించుకొనిపోవు
నీచమైనభూమి జూచినావె ? ౧౩౪

క్రూరుల్ కుత్సితు లస్మదీయములు హక్కుల్ దోచుకొన్నారు న
న్నూరింబైటకు నెట్టినా రిపుడు నన్నోదార్చుచున్నారు గాం
ధారేయుల్ నెలకొల్పినారు బహుసంస్థల్ లక్కయిండ్లక్కటా
మారుండమ్ములు నమ్మజాలని విశ్వాత్మశ్రీసమారంభముల్.

తనురక్తంబు వ్యయించి సత్కవికళాద్రవ్యంబు వెచ్చించి మ
ల్చినశిల్పాలువిమర్శక బ్రువుల కత్తివ్రాతలం ఖ్యాతికె
క్కనివైపోయెనసూయ చేబలుకునాల్కల్ సత్యమున్ జాటునే
అనుమానింతురు కొందరీశ్వరుని ధర్మాధర్మనిర్ణేతృతన్.

జనులం బీలిచి పిప్పిజేసెడుదురాచారంబులన్ గాలమ
ట్టని విద్యాబలమేల? విద్యయన మౌఢ్యవ్యాప్తికింపైన భో
జనమా? మోసపుబ్రాతకోతలకు రక్షాబంధనమా యెందుకీ
మనుజత్వంబు నొసంగలేని చదువుల్ మైరేయపుం మైకముల్

చిరకాలంబును భిన్నజాతి మతముల్ జీవించు రాజ్యాన సు
స్థిరమైన శాంతి రహించునన్న నుడిసందేహించెదం బక్షిణీ
తురకల్ హైందవులీ స్వరాజ్యరథమున్ దోర్లింతురే? దక్షిణో
త్తరదిగ్దంతులు రెండునుంగలసి మేతల్ మేయుటా వున్నదే.

వీర వసంతరాయడను వేల్పొక డుద్భవమంది దుష్ట సం
హారమొనర్చి ధర్మము సహస్రముఖంబులు నాటునంచు నా
జారిన గుండెలో వెలుపుసల్లుదు రీ యనృత ప్రచారకుల్
కారణమ్ము పిచ్చితలకాయలకున్ వెడ నమ్మకాలకున్. ౧౩౯

పుట్టించెం దయలేని లోకమున నే పుణ్యాత్ము డో కుక్షిలో
ముట్టించెం బాగలేని యాకటిసెగన్ ముప్పూట లీచిక్కులో
నట్టిట్టై తపియించు నాకొదవు నాహారంబు భక్షింపగా
పుట్టంజొచ్చిరి దేవతల్ బహుళరూపుల్ బట్టలై చెట్లులై. ౧౪

ఉత్పలము

అట్టి లెడందనేర్చెడు మహావ్యధనాతడు వెళ్ళగ్రక్కినన్
చిట్టి! కదుబాష్పములు నిండిన కన్నుల సానుభూతిచూ
పెట్టి ప్రదక్షిణించి సురభిక్షువు నింటికి లేచిపోయె గ
స్సాక్షి స్వతంత్రభారత విభాకర బాలుడుతూర్పుడోలికన్. ౧౪౧

మునిపత్ని రాకపోకల
ఘనసందేశముల కతనఖర్చయి పోయెన్
దనురక్తి మా దరిద్రుండు
చనిపోవునో! తత్ఫలంబు జవిజూచెడినో! ౧౪౨

---